# మనవి

ప్రస్తుతకాలమందు కవులుద్గ్రంథరచన కుపక్రమించుటరుదు. వ్రాసిన నోపికతోఁ జదువుపాఠకు లంతకుముందే కఱవు. ఇకఁ జదువరులకుఁ జవులూరించు చిన్న చిన్న కావ్యభాగములకు మాత్రము కొంత ప్రాపుకలదు. అట్టిది యాధారముగాఁ దెలుఁగునాఁట గొన్ని పత్రికలు బయల్వెడలినవి. ఇందలి నా పద్యవ్యాసములలో హెచ్చుభాగ మట్టి పత్రికలకెక్కి, రసపిపాసువుల పరిచయ భాగ్యమందఁ గల్గుటెంతయు ముదావహము.

పరభాషాపీడితుఁడై మాతృభాష దెసకు మడమఁ ద్రిప్పుట కవకాశములేని తెలుఁగుబిడ్డ కిట్టి పద్యగుచ్ఛములు కొంతలోఁగొంత తీరికవేళ లందానందము కలిగించునని విశ్వసించి, వానిని గ్రంథరూపమున బయల్పఱచితిని. పాఠకు లీ గ్రంథమునుగూడ యథారీతి నాదరింతురని భావించెదను.

ఇందలి కావ్యభాగములఁ గొన్నిటి నింతకుఁ బూర్వము ప్రచురించిన ఆంధ్రి, సమదర్శిని, ములుకోలాది పత్రికాసంపాదకులకు, సాహిత్య కుటీరము, విఘ్నేశ్వరగ్రంథమాలా సంస్థాపకులకు, ఆదినుండియు మా గ్రంథ మాలాభివృద్ధికి తోడ్పడుచున్న పోషకవర్గమునకు - బహు కార్యనిమగ్నులయ్యు నా కోర్కె మన్నించి యీ కావ్యమును బరిశీలించిన శ్రీ కొత్త సత్యనారాయణ చౌదరిగారికి నా నమోవాకములు.

# విషయ సూచిక

# కానుక

నిరతము సద్గుణచయమున
వరలెడి మా కమ్మకొలము వన్నె గాంచంగన్
స్థిరమగు స్వర్గ సుఖంబులఁ
బురడించితి వైర గొనసపూఁడి నివాసా !

ఓ కందిమళ్ల వంశ సు
ధాకర శ్రీ వీరయాఖ్య ధన్యచరిత్రా
స్వైకె నీ సుతుఁ డలిపెను
నాకేశుని ప్రేమోలఁ గొనుము నా కృతికన్యన్ .

మృతులను సంస్మరియింపను
గతియై మహామునందు యశముఁ గల్పింపంగన్
కృతులు కదా చాలిన యవి
క్షితి నవి యెల్లగను మెచ్చు చేఁతలు గానే !

సకసకలాడు పేదల ననాథల నెల్లరఁ గాచి సర్వదా
మకుటము లేని రాజువలె మన్కువ మీఱఁగఁ జుట్టుపట్టులన్
సకలము నీదు మాటయి సాఁగిన గాథలు సంస్మరింప నం
గకములు పుల్కరింపఁ గలకాలము మానస మెల్లఁబొంగఁగన్ .

పేరు గాంచిన సంసారి బిడ్డ వనుచు
వాలకము చూచి మెచ్చనివారు లేరు ;
కోర్కెలను దీర్ప బంగారుకొండ వనుచు
నండచేరని నిఱుపేద లుండఁబోరు .

దురిత మిది యని తలఁపని దుష్టజనుల
సద్గుణంబులఁ దనరారు సరసమతుల
మన్ననలఁ బొంది యెల్లర మానసములఁ
గొల్ల కొట్టియుఁ బేరందు కొంటి వౌర ! !

నీదు నానతిఁ దలఁ దాల్చి నెగడుచుండి
మించు భక్తిని వలపు లూరించుచుండి
శుభము లొనగూర్చు వేంకట సుబ్బమాంబ
నక్కటా ! దుఃఖమున ముంపఁగునె నీకు .

పరుల మది నొవ్వనట్టి సంభాషణంబు
మాయ మర్మము లెఱుఁగని మానసంబు
సూనుఁడై ఖ్యాతిఁ గూర్చిన సుబ్బరాయ
చౌదరికి నేర్పియుంటివి సాధుచరిత !

పేరు ప్రతిష్ఠ లందుటకు వేడుక చెందడు ; కాని దానికై
బారలఁ జావఁబోఁ డెపుడు ప్రాపక మిచ్చియుఁ బేదసాదలన్
గూరిమితోడఁ బ్రోచుటకుఁ గొంకు నెఱుంగని సత్కుమారు నే
తీరునఁ గన్నవాఁడ వౌరఁ దీసిన కత్తిని వీరయాఖ్యుఁడా !

మేలుగ నట్టి జ్ఞానయుని మేటిలఁ జేయఁగ గ్రామమందు వి
ద్యాలయము నెలకొను నిల్పితివి; దానికి నీ కొమరుండు ప్రాజ్ఞతోఁ
జాలిన యట్టి మందిరము స్థాపన సేయఁగ నెంచి కీర్తితోఁ
దేలిన నీ చరిత్ర వినుతింపఁగఁ జేయఁ దలంచె భక్తిమైఁ .

నిరుపేదలను గాంచి నిట్టలంబునఁ గూలి
కరుణించి వారలఁ గాచి యుండె ;
మాతృదేశోన్నతి మల్లడింపఁగ నెంచి
తెలుఁగు బాసకు హాయల్ తీర్చి కూర్చె ;
పుర వరేణ్యులఁ జేసి సరిక్రొత్త విజ్ఞాన
గరిమంబు సమకూర్పఁ గలిగి యుండె ;
జనని మాటకు నెప్డు జవదాఁటి యెఱుఁగక
విమల సద్భక్తితో వెలయుచుండె

నెల్ల వారల మెప్పుల నినుసుడింప
సద్గుణంబులఁ బ్రకటింపఁ జాలియుండె ;
నవుల మరు కీర్తితోడ నీ యాత్మజుండు
నీదు విఖ్యాతి తిరముగా నిలుపుచుండె .

కొంచెము జాచి యాచకులు కోరిన కోర్కెలఁ దీర్పఁజాలు నా
వంగస మందుఁ బుట్టి విభవంబునఁ దూఁగెడి నీదు బిడ్డచే—
పొంగులు వారి నీ యశము భూరుహమట్టులు పెంపునింపుచున్
బంగరు పూలు పూసినని భాసిలు నట్టులు తెల్గుగడ్డపై .

జీవముఁ బాసి స్వర్గమును జేరిన తండ్రి ఋణంబుఁ దీర్పఁగా
భావమునం దలంచి కడుభక్తిని నీ సుతుఁ డంపు కావ్యమున్
బావన కీర్తి చంద్రికల భాసిలునట్లు గ్రహించి మెచ్చుగా
దీవెనలంది నాకమునఁ దేలుము, ప్రోవుము కావ్యకన్యకన్.

౮-3-౮౮.

## తెలుఁగు తల్లి

చిలుకుఁ బల్కులతోడఁ గ్రొంగ్రొత్త కవనంబు
నన్నయ్య గంటాన నడచునాఁడు
గౌడ డిండిమభట్టు కంచు ఢక్క నగల్చు
కవిసార్వభౌముని గాంచు నాఁడు
కన్నీరు మున్నీరుగా నేడ్చు శారద
నోదార్చు పోతన్న లున్న నాఁడు
పెద్దనార్య శిరీషపేశలమ్మగు కైత
యాంధ్ర భోజుని సభ నలరు నాఁడు

పౌరులు వా రెల్ల నినుఁ గాంచి పొగడినట్టి
తద్యశోరాశి నేఁటికిఁ దఱిగెనమ్మ!
దీప్తి వెలుఁగొందు నట్టులఁ దాఁగి చూచి
దిక్కుకోసమ్మ తొలిసారు తెలుఁగు తల్లి.

ఒక ప్రక్క పలకింప నోరుగంటి బయళ్ళఁ
గాకతీయుల శక్తి కందళించు
ఒక పక్షమునఁ జెవియొగ్గ "హా" యను హంపి
శిథిల సౌందర్యంబు చిప్పరువెట్టు

ఒక దిక్కు గన్న మే నుడికించు నమరావ
తీపురంబున శిల్ప మేఁపు సూపు
ఒక చాయఁ జూడ నుజ్జ్వలత లూఁనెడు రెడ్డి
వీరగాథలు కొండవీటఁ జెలఁగు

పూర్వ చరితలఁ గని విని పొంగి క్రుంగి
వేఁడి నిట్టూర్పు నుచ్చెడి వాఁడె కాని
పాఠ మీరీతి ముక్కోటి బలఁగ నుండి
ఫలము లేదని తెలుపఁడే తెలుఁగు తల్లి.

అమల పౌరుషకీర్తు లగ్గించు పలనాటి
పురుష సింహంబు లీప్రొద్దు లేరు
రక్తరేణువుల శౌర్యంబు చిందించు బొ
బ్బిలి వీరవర్యు లీవేళ లేరు
అల కుతంత్రుల దాడు లంతరింపఁగఁ దంత్ర
ములఁ బన్ను సచివు లీపూఁట లేరు
దెబ్బకుఁ బైదెబ్బ తీసి కొట్టెడు దండ
నాయకోత్తంసు లీనాఁడు లేరు

“వాణి నారాణి” యంచు గర్వమునఁ బల్కు
ఘనత కెక్కిన కవులు నీ దినము లేరు
తిరిగి చూచియు వెనుకటి తీరుసెడక
తేజరిలవమ్మ మున్ముందు తెలుఁగు తల్లి.

తమిళ కర్ణాటోత్కలములందు మా తెల్గు
మొనగాండ్రు విసతు లందిన దినంబు
‘దేశ భాషలలోన దెలుగు లెస్స’ న సారె
దీపించు రచన దిద్దిన దినంబు
పాఱు తెంచిన పతిక్ష బరిహాసించియు రణం
బున కంపు మగువ లుండిన దినంబు
బొందితో కైవల్య మందిన భక్తులం
గని సంతసించి యుండిన దినంబు

గడచి పోయిన దసి మది సడలకమ్మ !
ప్రాతిక చెడినట్టి నీ పూర్వ భాగ్యరేఖ
తిరిగి రాబోక మారు వెనుకకు మరలి చూచి
తీరుగా [illegible] తెలుగు తల్లి !

కాన్పింప లేదటో ? కాకతీయుల దివ్య
సామ్రాజ్య వైభవ జయపతాక
వినిపింప లేదటో ? విద్యానగరసీమ
నలరిన విజయసింహపుఘుల ప్రాంత
కాంతిరేఖ లేదటో ? గండికోట బ మ్ముల్ల
విహరించి జవగిన విచ్చుకత్తి
తిలకింప లేదటో ? గర్జించు పలనాటి
వీరగాథలందేటి పౌరుషాగ్ని

చూడ లేదటో ? కొంత మచ్చునకు నైన
వీరవరు నెన్నఁడీ కొండవీటి యందు
వ్రక్కలై పోయె నీ పురావైభవంబు
తిరిగి నిలఁబెట్టుకోవమ్మ తెలుఁగు తల్లి .

పాసిపోయెను ఢిల్లి పాదుషా కన్నులు
గప్పిన మంత్రి యుగంధరుండు
కనుమూసి పోయె నఖండ దిగ్విజయుంబు
మహిపతి కిడిన తిమ్మరుసుమంత్రి
అణఁగారిపోయె మహాలౌక్య సంపన్నుఁ
డరివీరభయదుఁ డక్కన్న మంత్రి
తొలఁగి పోయెను సదా తులలేని తంత్రముల్
పన్ను కోవిదుఁడు తిక్కన్న మేటి

కరము భాసిల్ల రాజ్య చక్రంబు త్రిప్పఁ
జాలి యుండిన సచివులీ కాలమందు
గానరా రెక్కడైన నీ సూనులందు
తిరుగా దిద్దుకోవమ్మ తెలుఁగు తల్లి .

భూరి సంపద నాంధ్ర భూమి నేలిన రుద్ర
మాంబను గన్న ముత్యాల కడుపు
నడుము గట్టిన దండనాయకురాలు నా
గమ్మను గన్న బంగారు కడుపు

మగనికిం దగిన యామాసవ సాంచాలిని
దయమీఱం గన్న రత్నాల కడుపు
అభినుతించు కవిత్వ మల్లిన మొల్లను
సరి చక్కఁగన్న వజ్రాల కడుపు

తనదు దేశంబు తన భాష తన యశస్సు
తనదు దేశీయ చరితంబు తన విభూతి
మఱచి యుండిన పెద్దల మరలఁ దిగిచి
దిద్దుకోవమ్మ మున్ముందు తెలుఁగు తల్లి.

తుంగభద్రా సముత్తుంగ తరంగాల
నణఁగిపోయెను స్వభాషాభివృద్ధి
కూలిన స్వర్గంపుఁ గుడ్యాంతరాలలోన
నాఱిపోయెను పౌరుషాగ్ని కణము
రత్నాకరేంద్రు సంరంభ ఘనఘనములో
నొదిఁగెను బంగారు టోడ కేపు
అన్యదేశంబుల కప్పు ముసుగుచుండ
బడలిపోయె దెలుంగు ప్రాభవంబు

నామ రూపాలు గనరాని భూమిఁజేసి
సాఁగి పోయెను మా శిల్ప చతురతయును
నిగిడిన నేఁడొక్క కన్నీటి బొట్టు
కల్లువడె యాంధ్ర కేదార ఖండ మంతా.

ప్రోజ్వలించెడి నిర్మలోదక వాహినీ
జాత గంభీర గర్జనము లందు
మిన్నంటు శైలముల్ మేఘవర్ణంబుతో
శోభిల్లుచుండిన సొబగునందు
సంజకాలమున నుత్సాహ తరంగాలఁ
దేలు విహంగ గీతికల యందు
పొంగారు కమ్మని పూఁదేనె గుత్తులఁ
గ్రాలెడి మత్తాళి గానమందుఁ

దనరి ప్రకృతి మహత్త్వ సౌందర్య గరిమ
విమలమై విశ్వ విస్మితమై వెలయుచుండె
భవ్యయశముఁ గర్వపర్వంబు చేసి
తేజరిలవమ్మ మున్ముందు తెలుఁగు తల్లి.

౬-౧-౪౧.

సతతంబు ఋజుమార్గచరులై ప్రవర్తించు
సత్పూరుషులఁ గని సాఁకినావు
వివిధ శాస్త్రార్థము ల్వివరింపఁ గలిగిన
పండితులను గని ప్రబలినావు

మహితకీర్తి విరాజిత మానవతులఁ
గరుణతోఁ గని కాపాడఁ గలిగినావు
సుఖము లొనఁగూర్చి యెల్లరఁ జూచినావు
ఘన యశముఁ గూర్చు భారత కల్పవల్లి.

౨౧-౧౦-౬౮.

# పురుటిగడ్డ

శ్రీలు విరజిమ్ముచుండిన కాలమందు
సంక గాలమందుఁ గూర్చుండి హాయిమెయిని
శుభము లందాచుఁ గడపిన సుతులఁ దలఁచి
పొంగుచుండెను మే నెల్లఁ బురుటి గడ్డ.

తఱుఁగు పడకుండ నింటింట ధాన్యరాశి
కుప్ప తెప్పలుగా సమకూర్చి సుతుల
సౌఖ్యములఁ జేలి యాడించు సమయమందుఁ
బుట్టు వొసరింపకుంటివి పురుటిగడ్డ.

అప్పు డపుడు కూడఁబెట్టిన యర్థమెల్లఁ
దాతకుం జూపకమ్మమ్మ దాఁచనెంచి
యటుక పైఁ జేర్చి పెట్టిన యదను నందు
పుట్టఁజేయంగ వైతివి పురుటిగడ్డ.

ఆయు రారోగ్య భాగ్యంబు లతిశయించి
కాయ మెప్పుడు కందక కఠిన శిలల
మాడ్కిఁ దనరారి హాయిగా మల్లడించు
తరుణమునఁ గాంచకొంటివి పురుటిగడ్డ.

పొరుగు వారెల్ల గుంగూడి పులిసిపోవఁ
బిఃధవిల్లుచు నుండెడి పైఁడి ముద్ద
లందఁ జేసిన తరుణమం దెందు కతన
పుట్టు వానరింప కొంటివి పురుటిగడ్డ.

౮-౬-౪౦.

ఆంధ్రుఁడా !

ఒక మారీ భరతోర్వి దిగ్గరనగా సామ్రాజ్యాంత లూఁగించి యం
దకలంక ప్రతిభావిశేషముల శౌర్యంబొప్ప నద్దిక్కులన్
బ్రకటింపం బడినట్టి తత్ప్రతిభ దివ్యత్వంబుఁ గోల్పోయి నేఁ
డకటా ! చిందఱ వందరై చివికెఁగా యాంధ్రత్వ మిట్టేరునన్ .

నీ సరి లేరటంచు నవనీపతు లంజలివట్టి నిల్చి నీ
దాసుల మంచుఁ జోళ-మగధావని-కేరళ-పాండ్య సీమలన్
దోసిలి యొగ్గి నీ కొసఁగి దూరగులై చరియించునాఁడు నీ
వాసియు వన్నియున్ భువినిభాసిలి యుండఁగ లేదెయాంధ్రుఁడా!

మాయన్నల్ సదా దురభిమానము కొందఱు లోఁదలంచియున్
చేయఁగరాని కష్టములఁ జేయుచు నల్లరిపెట్టి యాంధ్ర తే
జోయశములంపఁ జీలికలఁ జొప్పడఁజేసి స్వరాష్ట్రవాంఛ యే
లా యనిపించుచుండి పితలాటకము ల్గలిగింత్రు సోదరా !

దాతలు-భాగ్యవంతులు-వశాస్త్రులు-ప్రాజ్ఞులు-సర్వలోక వి
ఖ్యాతులుమూఁడుకోట్లుగల యాంధ్ర కుమారులఁగాంచిలోకపులీ
రీతిగఁ దొంటి వైభవ మెఱింగి చరంపరటన్న నా యప
ఖ్యాతికి నాంధ్రు లోర్చి మనఁగల్గుదురే భువి నాంధ్రవీరుఁడా !

పరు లిడునట్టి యా కపటబంధము లన్ని త్యజించి నిల్చి యు
బ్బురమగునట్టి మార్గములఁ బూని, కుతంత్రులు సిగ్గుచెంద సు
ర్భరమగు పాట్లకైనఁ దమ ప్రాణము లర్పణచేసి, రాష్ట్రముక్
దిరముగఁ దెత్తుమంచుఁ గసుదీక్షను బూనఁగసాగుమాంధ్రుఁడా !

౨౪-౪-౩౯.

ఖడ్గతిక్కన

పడఁతి పక్కన నవ్వి పసుపు ముద్ద నొసంగు
అవమానమున కెంతో యలుక చెంది
తల్లి దండ్రు లిసుమంత దయలేక మాటాడు
పోటు మాటల కెంతో పొక్కిపోయి
అనుఁగు నెచ్చెలు లెల్లరును జంకకయ చూపు
చీఁదరింపుల కెంతో సిగ్గునెంది
పగతు రెల్లరుఁ గూడి పటుదర్పమునఁ గూయు
కాఱుకూఁతల కెంతో కలఁత చెంది

మొటుల సంగర రంగమం దేపుమీఱఁ
బగఱ గుండియలను బదా బదలు చేసి
తుదిఁ నాహవ భూమిలోఁ గ్రుంగి నావొ
ధీర ! విప్రకులాధార ! తిక్కశూర .

౯-౮-౩౮ .

## మహాత్ముఁడు

దేశోద్ధరణ కార్యదీక్షనే మది నెంచి
సుస్థిరమగు శాంతిఁ జూపి యుంచె
సరయు నస్పృశ్యత యఘమని బోధించి
న్యాయంబు ప్రజలలో వ్యాప్తి చేసె
ఘనులకు సాధ్యంబుగాని సత్యాగ్రహ
స్ఫూర్తి బార్డోలిలోఁ జూపఁ గలిగె
ఖద్దరు వస్త్రముల్ కట్టుచుఁ దానార్థి
క స్వారాజ్యంబు మార్గంబుఁ దెలిపె

దేశభక్తిని బ్రజలెల్లఁ దేజరిల్లు
నట్లు దేశోపకారకమైన వివిధ
మార్గముల నెల్లఁ జూపి సన్మార్గదర్శి
యయ్యె మన కెల్ల గాంధీమహాత్ముఁ డిపుడు.

౨౯-౧౨-౨౮.

## భోగి సంక్రాంతి

ఇంటింటి కడ భిక్షమెత్తు జంగము తాత
ధ్వనించు శంఖ ఢాంకార మందు
'రంగ రంగా' యని పాడుచు నృత్యంబు
గావించు హరిదాసు గళమునందు
రంగు పాగఁ జుట్టి గంగిరెద్దులవాఁడు
సొక్కించు సన్నాయి నొక్కులందు
'అక్షయంబగుఁ గాత' మని పల్కి బట్రాజు
కీర్తించు కళ్యాణ గీతియందు

శ్రుతిని గలుపుచుఁ బాడుచు శోభఁ గూర్చి
ప్రకృతి సౌందర్యమెల్లఁ దీపాల నింపి
కాంతులతోఁ వెల్గుచుండె మా గ్రామసీమ
భోగి సంక్రాంతి నీ పూర్వపుణ్య మేమి!

పారాణికాంతుల తీరు తీయమ్ములు
గోరంట పూఁతలు గుమ్మరించె
పొంగళ్లఁ జేయించి పూజావిధుల్ దీర్పఁ
కూశ్మాండ ఫలరాశి కులుకుచుండె

వన్నె చిన్నెలతోడ వాకిండ్లపై నాడ
బంతిపూవులు నాత్రపడుచు నుండె
శిరము లల్లాడించి తటితీపి పాలతోఁ
జెఱకుఁదోఁటలు నిరీక్షించు చుండెఁ

గలిమి పండిన రీతిగాఁ గాలగతులు
పాఁడి పంటలతో నిండి ప్రబలియుండ
సందడుల మున్గియున్నది జనపదంబు
బోగి సంక్రాంతి నీ పూర్వపుణ్య మేమి !

జిలుఁగు ముత్తెంపు ముగ్గులు నిగ్గులను జిమ్మ
కరణి వాకిళ్ల ముంగల రచించి
సింగార మొలికించు రంగవల్లులలోన
గొబ్బెమ్మలను జతఁ గూర్చి చేర్చి
తీరు తీరగు పూల తోరణమ్ములచేత
ద్వారలక్ష్మికి నలంకార మొసఁగి
పెందలకడఁ బాలు పిండి పొంగలిఁ జేసి
తనివి తీఱఁగ దైవతములఁ గొలిచి

పాయసాన్నంబు లింటింటఁ బంచిపెట్టి
పొంగి సంతోష జలధి తరంగరాశిఁ
దేలి యాడుచు నున్నారు తెలుఁగుఁ జెలులు
బోగి సంక్రాంతి నీ పూర్వ పుణ్య మేమి !

౧౦-౧౨-౮౧.

## చలిగాఁడు

లోకుల వగు వారి నెల్ల విలోకనములఁ
గాంచినంతనె పైఁబడి కవయుటేల?
కలఁత నెందుదు నా ప్రభాకరుని జూచి
కాలికిని బుద్ధి చెప్పుచుఁ గదలుటేల?

పసగల లేఁత దంపతుల పజ్జను స్వప్నమునందు నేనియున్
మసలఁగఁ బోవు; పోయినను మాటలతో నినుబుచ్చియుందురే?
కసిమసి చేయరే బిగువుకౌఁగిట నొక్కుచుఁ జిచ్చురాల్చుచు
న్నసువులఁ బాపరే సుఖమయమ్మగు ప్రొద్దులుపుచ్చు వేళలన్.

అటమటల్ పాపు దుప్పటి లేక క్రుంగెడి
నిఱుసేదపై నిజ్జ నీళ్లై యెక్కి
రూపడంగెడి దీర్ఘరోగి చెంతకుఁ బోయి
తల్లడిల్లఁగ జబర్దస్తి చూపి
బక్కచిక్కిన మేను వడి కృశించెడు వృద్ధ
జనులపై కెగసి పచారుచేసి
తెలవారె నని లేచి దినమెల్లన్ దిరుగాడు
పిల్లకాయల చెంతఁ బెల్లురేఁగి

౨౪ సజ్జ

అనిలుఁడు ననుంగు నెచ్చెలి యయ్యె నంచు
హిమకరుఁడు తోడు నీడగా నమరె నంచుఁ
జిందులను ద్రొక్కఁదగునే నిశీథమందుఁ
గట్టి పెట్టుము నీ పిచ్చి గంతు లెల్ల.

తగని గర్వంబుతోడ సర్దారు నంచు
సివము లెక్కఁగ హేమంత శిశిరములను
గంతు లిడుచుంటి వౌర! వసంత లక్ష్మి
వచ్చుచున్నది పో పొమ్ము పిచ్చి మాని.

వాసి గల శీతరశ్మి 'వత్తాసి' చూచి
యబల యని త్రోసి పుచ్చితో యామె వెనుక
దండధరు మాడ్కి గ్రీష్మ ప్రచండమూర్తి
చుఱచుఱను జూఁడి నీ దేహశుద్ధిఁ జేయు.

శూరుఁడ వగుచో రష్యా
వీరులఁ గాపాడి, విఱ్ఱవీఁగెడి హిట్లర్
గోరింగుల కడ శంఖము
పూరింపఁగదోయి నీకుఁ బుణ్యం బుండున్.

బలవంతు లగు నియంతలు
బలహీనులఁ బట్టి ఘోర బాధలఁ బెట్టన్
గలుగుచు మసలెద వేటికిఁ
జలిగా! నీ తన్ను గొయ్య చాలును బోరా.

౯-౧-౪౨.

* కవిరాజు

కమ్మ సత్కావి విర జిమ్మ కన్న గాడ్పు
తలమునుకొనఁ దెల్గు మాగాణమందు విసరి
పేరుఁ గాంచిన నిను నేఁడు గౌరవింపఁ
బ్రకృతి పులకించెనో కవిప్రభువతంస.

ఆంధ్ర కవితా సుధాపూర్ణ యగు సరస్సు
క్రొత్తరంగ నీవ కావె దుర్గుణులు కొంద
ఱనదలై చాటు చాటున గొణఁగి నంతఁ
గలుగు లోటేమి నీకు నో కవికులేంద్ర!

ఇరుగు దేశంబులం దుద్భవించి యున్న
నెప్పుడో రాచయోస్తు నెక్కించి నీకు
దీప్తి నెలుఁగొందుచుండ దిగ్దేశ జనులు
జయము జయలు వెట్టరే? కవిసార్వభౌమ.

* “[illegible] శ్రీ రామస్వామి చౌదరిగారి సన్మాన [illegible]”

పాడి దొఱంగి దుర్మతులు బందెల నిడ్డ పురాణ గాథలన్
బోఁడిమి వాయకుండ వడపోఁతను బోయి దలంచి నూత్నపుం
జాడలఁ ద్రొక్కి నేర్పుమెయిఁ జాటితి వెన్నొ రసాశ్రయంబులై
వాడల వాడలన్ విబుధవర్యులు మెచ్చెడి మేటికబ్బముల్ .

నిను దేశీయులు ప్రేమం
గన రేమని నాకుఁ గిన్క కలుగందగునా
అనవద్య చరిత! మనుజుని
మన ఉన్నతిఁ జాట నొరుల మన్నన లేలా ?

౧౯-౨-౭౨ .

* అభినవ తిక్కన

పలుకు పలుకున మాధుర్య మొలుకఁ జేయు
రాష్ట్ర గానానుకూలం బనురాగ మంచి
తెలుగు వారెల్ల నీనాఁడు తెగువ చేసి
గౌరవింపఁ బూనిరే నిన్నుఁ గవిశ్రేణ్య !

అఱిన పితలాటకంబుల నణఁచి పెట్టి
ప్రక్కవారలఁ జింగులు త్రొక్కఁ జేసి
తెలుఁగు వారెల్లఁ గన్నులు తెఱచునట్లు
రాష్ట్రగానంబు వెలసె నీ రాష్ట్ర మంచు .

విమల విజ్ఞాన ధనముతో వెలయుచుండి
యమలమగు దేశభక్తితో నలరుచుండి
గానమును జేయు నీ రాష్ట్ర గానమునకు
నంజలి ఘటింప కుండునే ? యాంధ్ర జగతి .

---

* ౧౨-౭-౮౨ 'అప్పికట్ల' గ్రామమున సన్మానితులగు 'అభినవ తిక్కన' శ్రీ తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారిని ఉద్దేశించి వ్రాయఁబడిన పద్యములు.

రాజనరేంద్రుండు రాజిల్లి యున్నచో
నగ్రహారములు నీ కబ్బుచున్న
మనుమసిద్ధి నృపుండు మనియున్నచోఁ దూఁగు
టుయ్యాలలోన నిన్నూఁచుచున్న
కొండవీటి ప్రభుల్ కొమరారి యున్నచో
నెనలేని సంతోష మెసఁగుచున్న
ఆంధ్ర భోజుండె యిప్పు డలరారి యున్న నీ
మత్తగజంబుపై కెత్తుచున్న

అంచితంబైన కీర్తి గడించి తెలుఁగు
శారదను వన్నె తెచ్చుచు జగతి విభులు
కటకటా! దాఁటి పోయిన కాలమందు
నేల పుట్టితివో సత్కవీశ నీవు!

ఒక్క సన్మాన మది యొక లెక్కగాదు
భారమైనట్టి ఋణములోఁ బడియె నాంధ్ర
దేశ; మేరీతి నీ యప్పు దీర్పఁ గలదో
మాతృ సేవాపరాయణ! మాన్య సుకవి!

౮-౨-౮౯.

## విజయ విలాపము

బాల్యంబునను దండ్రి పరలోకమున కేగఁ
ప్రేమతో నెవ్వండు పెంచినాఁడు
శైశవం బాదిగా శ్రద్ధతోఁ జనువుల
నెల్ల నెవ్వండు నేర్పించినాడు
ఆదినుండియు మాకు సఖిల సౌఖ్యంబుల
నొసఁగూర్ప నెపుడు పాల్గొనిన వాఁడు
నిముసంబు మమ్ము నేత్రములఁ జూచికొనియున్న
సరియు భ్రాతృవ్యుల నెవ్వఁ డంపువాఁడు

అట్టి గాంగేయుతోడ నేఁ డెక్కుటంట !
పోరు సల్పంగ నే నెట్లు పోవువాఁడఁ
గూర్చు బంధుల పుత్రుల్గోసి యాజ్య
నం బొనర్చెడి యీ వైభవం బదేల ?

కన్న కుమారుకంటె నతి గౌరవ మారఁగఁ బిల్చి పార్థ నా
కన్నను మేటి వీరుఁడవు కమ్మని తగ్గఁ వరం బొసంగి యు
త్త్యున్నతిఁ గూర్చినట్టి గురు, ద్రోణుని తత్తనుజాతుతోడ నే
తెన్నునఁ బోరువాఁడ వసుదేవ కుమారక, దీనపాలకా !

సోదరు లెవ్వరెల్ల, సుతులు గావలె వారు
పరు లెవ్వరియ్యెడఁ బొలఁజూడ
మామ లౌదురు వీరు మాతులేయులు వారు
ఎవరితో రణమందు నెదురుకొందు
ముదుసలి యీతండు భూసురుం డాతండు
సంగర మేరితో సలుపువాఁడ
ఈతండు సహపాఠి యిది మిత్రసంతతి
యెవ్వరితో శాస్త్ర మెసఁగఁ జూతు

ఎదురుకొనుటకుఁ బెఱవార లెవ్వరిందు
బంధువుల నెల్ల రణమందుఁ బాప మనక
కుత్తుకలఁ బట్టి పఱపఱఁ గోసి పొందు
సౌఖ్యములకన్న విపిన వాసంబె మేలు.

కల్లనైనఁ బరకాంతఁ గని యెఱుంగని నాదు
ధవుఁ డీల్గె నంచును దరుణి లేద్వ
గడుప్రేమతో మమ్ముఁ గని పెంచుచుండిన
జనకుఁ డీల్గె నటంచుఁ దనయు లేద్వఁ
బాల్య మాదిగ మమ్ముఁ బాయని చెలికాని
మిత్తి మ్రింగె నటంచు మిత్రు లేద్వఁ
గన్న బిడ్డల రీతిఁ గాపాడు మా దొర
యంతరించె నటంచు నార్తు లేద్వ

ధరణి యెల్లెడ నెత్తురు వఱద లురల
బంధువుల నెల్ల నీరీతిఁ బాప మనక
చంపి శూన్యప్రదేశమౌ జగతి నేలు
కొనుచుఁ దినలేము నెత్తురుఁ గూడు కృష్ణ.

దామోదరా, మేము ద్వాదశవర్షముల్
కాంతార సీమలోఁ గడపలేదె
యా చందమిపుడు వనాంతరంబులఁ జేరి
సంయమి వృత్తిని సంచరించి
కాలంబు మెల్లఁగఁ గడపుచుందుము గాని
కఱకు కత్తులను దుష్కార్య మనక
బంధువులను జంపి ప్రాజ్య రాజ్య సుఖంబు
లనుభవింపఁగ నొల్ల మనఘమూర్తి

చిత్త మెల్లను గలఁతను జెందుచుండెఁ
గాయమది స్వేదబిందు సంకలిత మయ్యెఁ
గూర్చు బంధుల కుత్తుక ల్గోసి యార్జ
నం బొనర్చెడి యీ వైభవం బదేల?

౨౮-౧-౨౯.

తాఱు మాఱు

పిసినారి కెనలేని విత్త మీయఁగ నేల!
ఈవికానికి లేమి నిచ్చు టేల!
పేదవారలకు గంపెడు బిడ్డ లీ నేల
ఉన్నవారికి సంతు సున్న యేల.
చవటకు సరిలేని సద్గౌరవం బేల
విబుధవర్యుని జార నిడుచు టేల
చెనఁటికి దీర్ఘాయువును బోయఁగా నేల
సాధుశీలుర నట్టె చంపు టేల
భోగి సౌఖ్యములతోఁ బొంగి పోవఁగ నేల
కష్టజీవికిఁ బొట్ట కాలనేల
మానవంతులు చాటు మాటు చేరఁగ నేల
కూళలు స్వేచ్ఛమైఁ గులుక నేల
సాధ్వి కెన్నఁగ రాని సంకటంబు లవేల
చెడిప సౌఖ్యంబుతోఁ గడపనేల
అల్పబుద్ధికి మేటి యాధిపత్యం బేల
బుధవరేణ్యులఁ ద్రోసి పుచ్చుటేల

వింత భోగము లెల్ల వెలయింపఁగా నేల
మించు రుగ్మతలలో ముంచనేల
జీనకోటిని బెంపు చేసియుండఁగ నేల
హాతమార్చు మార్గంబు లరయుటేల
తల్లి బాసను గన్నఁ దల్లడ పడనేల
పరభాష లన్న చోఁ బరువులేల

సద్గుణమ్ముల నొకదెసఁ జాటుటేల
అవగుణమ్ముల వెన్వెంట నంపుటేల
పెద్ద తనమున నీబుఱ్ఱ మొద్దువోవఁ
దాఱు మాఱును జేయంగఁ దగునె ధాత ! !

౧౫-౫-౮౦.

## అనుతాపము

ధనురాచార్యుని పుత్రుం
డని జనములు పొగడ జననమందియు నకటా !
మనమున దుష్కార్యం బని
కనఁజాలక బాలఘాతఁ గావించితిఁగా.

బాలురు నిద్రవోవునెడఁ బట్టియుఁ గంఠముగోయు నప్పుడున్
జాలి యొకింత చూపక విచారము నొందకయున్నవాఁడ దు
శ్శీలుఁడఁ బాపుఁడన్ ద్విజుల శీలము పాడొనరించినాఁడ నా
బాల విఘాత సంజనిత పాప మదెట్లు శమించు నయ్యయో !

అకట ! దుర్యోధనుని మీఁది యమిత భక్తి
దురిత మిది యని మనమునఁ దోఁపనీక
కొంపయుం దీసె నపనిందఁ గూర్చె నట్టి
నింద నెటు పాపుకొనఁగ నే నేర్చువాఁడ.

పాపపుఁగార్య మంచనక బ్రాహ్మణధర్మము వమ్ముచేసి ము
క్కోపముచేత బాలకుల కుత్తుకలన్ దెగఁగోయ నెల్లరున్
బాపియు ద్రోణనందనుఁడు బాలవిఘాతకుఁ డంచుఁబల్క నా
తాపము నోర్చి, ప్రాణ మెటు దాల్చి ధరిత్రిఁ జరింతు నక్కటా!

సుతుల మరణంబుఁ బార్థుఁడు సూడలేక
విక్రమంబున నన్నుఁ జంప వెడలునాఁటి
ప్రళయ కోపాగ్నికీలలు రగిలి మదినిఁ
గాల్చుచుండెను నేఁడును గలయఁ జుట్టి.

ఆపదను బాప బ్రహ్మాస్త్ర మదియు వేయ
నతని బ్రహ్మశిరోనామకాస్త్ర మణఁచెఁ
జేయునది లేక నుదికిఁ జేఁ జిక్కిపోయి
సామతి నెరిని మానమ్ముఁ గోలుపోయి.

కొమరులను జంపి వైచిన క్రూరకర్మఁ
బట్టి చంపిన నట్టి పాపమ్ము లేదు
కాని బ్రాహ్మణుఁ డౌటచే మానసీయుఁ
డన్న [illegible] పల్కు - నా యాత్మఁ గాల్చు.

విప్రుఁడని యెంచి ద్రౌపది విడిచెఁ గాని
బ్రాహ్మణత్వంబు బూడిదపాలు సేసి
సిగ్గు విడనాడి ప్రజలు ఛీ ఛీ యనంగ
బ్రదికియున్నాఁడ జీవచ్ఛవంబు వోలె.

ప్రాణమ్ము నపహరించుట
మానమ్మును దీయుటయు సమానమ్మని య
మ్మానిని వల్కెఁ గుంతీ
సూనుఁడు నా సిగను దఱిఁగి క్షుద్రుని జేసెన్.

వేద ధనుర్వేద విజ్ఞానరాశియగా
నాచార్యు కడుపున నవతరించి
శాంతి సత్య దయాది సద్గుణంబుల సరి
మైన విప్రకులంబు లోన వెలసి
విశ్వ విఖ్యాతిమై వెలయు భుజాబల
శౌర్యసంతుఁ డన జగతిఁ బరఁగి
వివిధ ధర్మార్థముల్ వివరించు విదురుని
యనుయాయి యని ప్రజలనఁగ నొప్పి

కటకటా ! నేఁటి కీరీతిఁ గలుష మనక
తగని యభిమానమును మదిఁ దలఁచి తుదికి
బాలకులఁ జంపి దుష్కీర్తిఁ పాలఁబడితిఁ
బాపినైతి నా జన్మంబు పాడుగాను

నన్నుఁ జూచి ద్రోణనందనుఁ డీతండు
పాపకర్ముఁ డంచుఁ బలుకుచుండఁ
బ్రజలలోన నెట్లు పాపినై నిలుతు ? నా
పాడు పుట్టు నేలపాలుగాను .

౧౫-౩-౭౯ .

## గణపయ్య గోల

ఎక్కడి ఘోరకర్మ మిది యెక్కడి పాపఫలంబు చూడ నా
కక్కట కోరికల్ దఱుగ నాఁకొని నప్పడు పెట్టుకున్నచోఁ
గక్కస మొందుచుఁ బరుల కార్యము లన్నియు భంగపుత్తునన్
మిక్కుటమైన నింద తల మీఁదను వైచ నిదేమి లోకమో !

కన్నులు లేని లోకమిది కావున సత్యము పీటిఁబుచ్చి యీ
తెన్నునఁ దిండిపోతని పటంబది దూషణ లాడుచుండియుఁ
జిన్నటికంబు చూప మది చిందఱ వందఱలయ్యె నక్కటా !
అన్నము పున్నమే మెఱుఁగ నట్టి ననున్ నిరసింతురా యిటుల్,

తొలుత నవిఘ్నమస్తనుచు దోసిలియొగ్గి భజించి కార్యమున్
ఫలితము చేయుమంచుఁ బలుభంగులఁ బ్రస్తుతిచేసి ప్రేమతోఁ
బిలిచియు షడ్రసంబులకు బెల్లపుముక్క నొసంగి నంపుచుఁ
బలువలు తిండిపోతనెడి పట్టము నా మెడఁగట్టి రక్కటా !

తిండికి రెండుసార్లు చిఱుతిండికి నింకొక రెండుసార్లు కూ
ర్చుండియు వేడి యిడ్డెనల నుప్మాను పిండిని రవ్వదోసెలన్
దండిగ మెక్క నయ్యుదర దాసుల కెవ్వరికబ్బనట్టి యీ
దండుగమారి పట్టమెటు దాపుర మయ్యెనొ నాకుఁ జూడఁగన్ .

చులకనయ్యెతి భాద్రపద శుద్ధ చతుర్థిని నాలు గుండ్రపుం
బలుకులు తిన్న నేరమున బాపురె! నాలుగు వేళలందునన్
సలలిత పక్షసాన్నములు చక్కఁగ మెక్కె, గీ తిండిపోతులన్
దలఁపదు గ్రుడ్డిలోక మెటు తాళఁగ నోర్పుగ నిట్టి నిందఁ బల్కఁ.

ఎలుక మదీయవాహ మఁట, యేనుఁగు మోమఁట నాది, చేటలోఁ
దులయగు కర్ణమంట, ఫణితో బిగియించిన బొజ్జయంట యీ
యలుపము లెందునుంగలవె యక్కట నన్నుఁ బిశాచమూర్తిఁగా
సలిపిన దుండగీండ్రకు శతజన్మములు న్నరకాన గ్రుగ్గరే.

ప్రాభవమొంది యుండెడిన పురాణము లొక్కెడఁ జెప్పినందునన్
వైభవ మబ్బెనంచుఁ బిడివాదము చేయఁగఁ బూనిరేని నా
శోభ కొఱంత యయ్యెనని సోముఁడు పక్కున నవ్వి యుండుటన్
దా భరియింపరాని ఫలితంబును బొందుట-సంస్మరింపుఁడీ!

తియ్యనినోట నెల్లరిటు తేలికమాటలనాడి; వేసవేల్
దయ్యపు వేషముల్ తలకుఁ దార్చుచుఁ గల్పిత గాథలల్లి, సన్
గొయ్యలమారినంచుఁ జెడగొట్టిరి తిట్టి రమాయకుండను సాం
బయ్య కుమారుఁడుం జులక నయ్యెనె? లోకువచేసి యాడఁగన్.

లోకువ చూపి నాపయిని లోకులు కాకులమాడ్కి వాడియా
బాకులవంటి నిందలిడి బాధను గూర్చిరటంచు నేల? ఛీ
కాకును జెందుటల్; గరళకంఠుఁడు దుర్గయు ముద్దుముద్దుగా
సాఁకిన బిడ్డ నిట్లనిన సైఁతురె శాస్త్రియొనర్చ కింతయున్.

౧౪-౯-౪౭.

యాటలాడించు చుండగా ననవరతము
నిట్ట నిలువునఁ గ్రుంగి కన్నీరు నింపి
దిద్దిరని నేత్రగోళముల్ తిరుగుచుండఁ
గన్నుఁగవ విప్పి చూచి యాకసము దిక్కు
యోచనలు చేసి వేఁడినిట్టూర్పువుచ్చి
వేఱె మార్గము తోఁపక విహ్వలించి
రాజశాసనములకుఁ బరాకుచెప్పి
గుండె జాలిని గావించి కొల్లఁగొట్టి
ప్రాట కూటికి మాత్రమే ప్రోగుచేసె
బెగ్గడిలి పోయి యుండిన పేదజీవి

... ... ...

మాయ మర్మము లెఱుఁగని మానవులను
దనువు దాఁపక శ్రమపడు ధార్మికులను
కటకటా! నేఁటికిట్టి యిక్కటులఁ జిక్కు
కుములుచుండిన పేదలఁ గ్రూరులంచుఁ
దోఁపిడులఁ జేయువారని దూఱుచుంద్రు
బాపురే! యిది యేనాఁటి పాపమయ్యొ
తినుట కింటను బూటబత్తెంబులేక
యింట నాఁకటిమంట దహించుచుండఁ
జేయరాని యకృత్యంపుఁ జేఁతలంచు
నించుకేనియు మదలోన నెంచకుండి

దారుణంబైన కర్మముఁ దలఁచెనేమొ
అంత మాత్రముచే నిట్లు లాడ దగునె!

... ... ...

నిలువు దోఁపిడి చేయుచు నిక్కవముగ
నందలంబెక్కి తైతక్క లాడుచుండి
నీడపట్టునఁ గూర్చుండి నివ్వటిల్లి
కడుపులో నీటి నించుక కదలనీక
బొజ్జ నిమురుకొనుచు నుండి బుజ్జగించి
కల్ల బొల్లి కబుర్లతోఁ గపట కరుణఁ
బలుకు పలుకునఁ దేనియ లొలుకునట్లు
చెప్పుచుం బేద నెత్తిపైఁ జేయివెట్టి
కాఁపుబిడ్డల స్వేదాంబుకణము లెల్లఁ
దక్క వగునట్టి 'ధర'లకుఁ దా గడించి
లాహిరిని ముంచి, లాభము లాగ నెంచి
గోటిపై మార్చి సరకులఁ గోట్లకొలఁది
లాభము గడించుచున్న పాలసులఁ గాంచి
కిమ్మనదు లోక మేమి కర్మమ్మొ గాని

... ... ...

పరులకు శరీర మర్పించి బ్రతుకు నొకఁడు
ఒరులకును ధర్మపిండంబు లొసఁగు నొకఁడు
పేదవారల రక్తంబుఁ బిండు నొకఁడు
ఇందు దోఁపిడికాం డ్రెవ్వ రెంచుమయ్య!

౨౫-౧-౪౨.

## కన్నీరు

అస్తమించె రామస్వామి యనెడి వార్తఁ
బిడుగు పడినట్లు గుండె గుభిల్లు మనియెఁ
జెమ్మటలు గ్రమ్మె మేనెల్ల సొమ్మసిల్లెఁ
జెనఁటి మృత్యువ ! నీవెంత చేసినావె! !

ఎట్టి దుష్కాలమం దుదయించినావో
జాలి యెఱుఁగని చండాలజన్మ మయ్యొ
ముద్దు ముచ్చట లంతకు ముంచె లేని
యధమురాలవు నీ జన్మ మడఁగిపోను .

తెలుఁగు గడ్డను దొల్లి ప్రతిష్ఠఁ గాంచి
మెఱయు రత్నములను దిగమ్రింగినావు
చాలకవియెల్ల, మా రామసామి నిపుడు
కాలమా ! పొట్టఁ బెట్టుకోఁ గలిగినావె .

సద్గుణంబుల కిల్లు నాఁజాలువాని
న్యాయ్యమార్గావలంబియై నడచువాని
సవ్యపథమున లేఖినిన్ నడుపువాని
మృత్యుదేవత నీ వెట్లు మ్రింగినావె!

గత శరత్తుల నాంధ్రు లుత్కంఠ తోడఁ
బ్రస్తుతింపుచు గుడివాడ పట్టణమున
గౌరవించిన యట్టి సత్కవిని నవుడె
మించు వేడుకతో నెట్టు మ్రింగినావె!

ఇంతకుమున్నె యెందఱు కవీశుల బొట్టను బెట్టుకొన్న నా
వంతయుఁ దృప్తి లేక యధమాధమురాలవు; నంగనాచివై
మంతన నెక్కనట్టి కవిమాన్యుఁడు మా కవిరాజు వైపునన్
సుంతయు జాలిచూపులను జూపక పోయితివేమొ మృత్యువా!

పొత్తిళ్లలో నున్న బుడుత ప్రాణములార్ప
వెనుకంజ లేనట్టి దనుజ వీవు
మిసిమిఁ గ్రక్కెడి నూత్న మిథునంబులను గూల్ప
భీతి చెందని చుప్పనాతి వీవు
బంధురంబగు ప్రేమఁ బ్రకటించు చెలికాండ్రఁ
నుసుమాడ నెంచెడి దుష్టి వీవు
ప్రణుతు లందెడి మహా ప్రజ్ఞానిధులఁ గాంచి
కూలఁ ద్రోయఁగ నెంచు కుమతి వీవు

సుగుణ మొకఁడైన నీయందుఁ జూడనేర
మస గుణంబుల రాశివై యవతరించి
మిణుకనేటికి లోకాన మృత్యుదేవి
పాపివగు నీదు జన్మంబు పాడుగాను.

కాలము తీఱని ఘనునిన్
వాలాయముతోడఁ బట్టి పల్లార్చియుఁ బెన్
గాలమునఁ గ్రుచ్చి యసువులు
జాలిని విడనాడి తీయఁజాలితి వకటా!

ప్రాత గాథకు వడపోఁతఁ బోయఁగ నెంచు
సూత్రాశ్రమములోని సుగుణుఁ డేఁడి
బుధవరేణ్యులు మెచ్చి పొంగి పోయెడి నూత్న
భావోన్నతినిఁ జూపు ప్రముఖుఁ డేఁడి
తెలుఁగు బాసకుఁ గ్రొత్త తెన్నులఁ జూపించి
విప్లవంబును దెచ్చు వీరుఁ డేఁడి
జాతీయ కవనంబు చలపట్టి మున్ముందు
చాటి చెప్పెదనన్న చతురుఁ డేఁడి

కట కటా! యిది యేనాఁటి కర్మమమ్మ
అంధకారంబు నాంధ్రికి నావరింపఁ
దెలుఁగువారల గుండియల్ దిగ్గు రనఁగఁ
జేసితివి మృత్యువా! యిట్టి చేఁత తగునె?

భావమందును జూడఁగా భాషయందుఁ
గవనమందును శబ్దసంస్కారమందు
విప్లవాగ్ని రగిల్చిన వీరవర్యుఁ
బొట్టఁ బెట్టియు మృత్యువా! పొంగినావె.

క్షాత్రధర్మము కురుక్షేత్ర సంగ్రామమం
దట్టాలమేడలై యవతరించి
సంఘ సంస్కారంబు శంబుక వధయందుఁ
బండువెన్నెల రీతిఁ బ్రభవమొంది
నీతి నియమముల సూతపురాణంబు
మలయ మారుతము నామల్లడించి
భక్తి వైరాగ్యముల్ పల్నాఁటి గీతలోఁ
బంటభూముల మాడ్కిఁ బరిఢవిల్లి

తెలుఁగు గడ్డను దిక్కు దిక్కులకు నెగసి
సూరిజనముల కరములం గేరియాడి
కావ్య కన్యక లార్జించు ఘన యశమ్ము
చెనఁటి మృత్యువ నీవేమి చేయఁగలవు ?

క్షణభంగురంబైన తను వొక్కటే కదా
కాల వాహిని యందుఁ గలిపినావు
పనికిమాలిన యస్థిపంజరంబే కదా
చితిమీఁద భస్మంబు చేసినావు
కఱఁగి కృశించిన కండరంబులె కదా
కాటిలో మసిచేయఁ గలిగినావు
సగము క్రుంగిన మేని సౌందర్యమే కదా
చేచేత దగ్ధంబు చేసినావు

అంత మాత్రముచేఁ గడు సంతసమ్మున
విఱ్ఱవీఁగంగ నేటికి వెఱ్ఱిదాన
రాణకెక్కిన సుకవి మారాముసామి
సద్యశము లేశమైనను జంకు లేవు.

నిక్కి మారయుఁగాఁ దెంబు నేలమీఁద
సమసి పోయిన మారాము సామి సుకవి
శాశ్వతపుఁ గీర్తి యేనాఁడు చావులేక
విశ్వవిఖ్యాతు లందుచు వెలయుఁగాదె.

౧౮-౧-౪౩.

## అయ్యవారు

ధనము నార్జింపఁగాఁ దగిన మార్గము చూపి
తనియింపఁ జేసెడి తండ్రి వీవ
జీవింప బోనంబు సిద్ధింపఁ జేసెడి
సరణిఁ గూర్చెడి బుద్ధిశాలివీవ
ధరణీ తలంబెల్లఁ దలక్రిందు గానింపఁ
దగు ప్రజ్ఞకూర్చు బోధకుఁడవీవ
లోక కల్యాణంబుఁ జేకూర్ప జాతియు
తను నిల్పఁగల ధన్యతముఁడవీవ—

ఇహాపరంబుల సత్కీర్తి నెసఁగునట్టి
సూత్రముం దెల్పుచున్నట్టి సుగుణివీవ
ప్రబల కీర్తిగడించిన పావనుఁడవు
దాంతిసముపేత శ్రీయుపాధ్యాయవర్య !

వినయమును ఋజువర్తన విమలకీర్తి
దానమును భోగమును గూర్పఁదగినయట్టి
విద్య నెప్పుడు పరులకు వేడ్కమీఱ
దాన మొనరించుచుందువు ధన్యమూర్తి.

ప్రజ లెల్లరును మెచ్చ పరిపాలనముచేసి
        రాజిల్లు రాజాధి రాజులైన
దేశకల్యాణంబు దీక్షతో సాధింప
        సమకట్టు నాయక స్వాములైన
చండప్రచండులై సమరస్థలిఁ జరించి
        వైరిగుండెలఁ జెండు వీరులైన
మాయమర్మమ్ముల మదినెంచి ధనము సం
        పాదించు వర్తక ప్రముఖులైన

నీదు బోధామృతముఁ గ్రోలి నీదు శిక్షఁ
బడసి యభివృద్ధినందినవారె సుమ్ము
కాంచుచున్నారు నిన్నప్పుఁ గల్గువోలెఁ
గంచెయే చేనుమేసిన కరణి నేఁడు.

అల్లరి చిల్లరిగా నినుఁ
బల్లెల నున్నట్టివారు పరుషోక్తులచే
నల్లరి వెట్టుచునుండిన
నుల్లము చెడనీయ వెప్పు డుత్తమచరితా !

చెప్పిన పనులెల్లఁ జేయనేరఁడీయయ్య
వారలేటికటంచు నదరు నొకఁడు
కారణంబె లేక కిండ్లెట్టు సేయుచు
గద్దించిపైఁబడు ఘనుఁడొకండు
ఎదిరూకలార్జింప మది సహింపఁగలేక
కుళ్లుచు లోలోనఁ గుములు నొకఁడు
పైవారికిం జెప్పి పని నడంచెద నంచుఁ
గంకణంబును గట్టు పెంకె యొకఁడు

వంగి వంగి సలాములు వందసార్లు
పెట్టలేదని కసిఁబూను పెద్దయొకఁడు
కటకటా! నేటికిట్టి యిక్కట్టుల కోర్చి
పల్లియల నెట్టులుంటివో పంతులయ్య!

అనుభవింపరాని యవమానముల తోడ
సైఁపఁ జాలనట్టి శ్రమల తోడ
మాఱు పల్లెలందు మ్రగ్గుచునే రీతి
నొదిఁగి బ్రదుకుచుంటివో మహాత్మ!

కన్నీరు నెప్పుడు మున్నీరుగాఁ జేసి
యాఁకటి చిచ్చు నిన్నలము చున్న
దిన దినంబొక్కొక్క తీరున శాసించి
యుద్యోగు లట్టిట్టు లూఁపుచున్న

నిరతంబు లోకులు నీరసింపఁగఁ జేసి
చుల్కనగా నిన్నుఁ జూచుచున్న
మూఁడు ప్రొద్దుల యందు ముసరుచుండిన మేఁటి
కడగండ్లు నిన్బట్టి కలఁచుచున్న —

ఇంచుకేనియు మదిని జలింపనీక
సంతతానంద మూర్తివై సంచరించి
యెటులఁ గడుపుచునుంటివో యెఱుఁగమయ్య
దాంతి సమువేత శ్రీ యుపాధ్యాయ వర్య!

నాలుగు మూలలం గల జనావళి విజ్ఞతఁ గోరి పూర్వ పుం
గాలము నందు నొజ్జలకు గారవమిచ్చి సమస్త విద్యలం
గ్రోలిన గాథలెంచి మదిఁ గుందుచు విహ్వాల మందుచుండఁగా
నేలొకో! కష్టముల్ సుఖములెప్పుడు నిల్చునె యొక్కరీతిగన్.

౨-౯-౩౨.

# సునీతి గ్రంథమాల

## పచ్చలతాడిపఱ్ఱు

### ఉద్ధారకులు

మ.రా.రా.శ్రీ. కందిమళ్ల సుబ్రహ్మణ్య చౌదరి గారు, భూస్వామి గోనసపూడి
,, పాములపాటి బుచ్చినాయుడు చౌదరి గారు భూస్వామి నిడుబ్రోలు
,, నల్లూరి రంగయ్య చౌదరి గారు భూస్వామి చింతలపూడి
,, కావూరి ఆంజనేయులు చౌదరి గారు వేటపాలెము.

### మహారాజ పోషకులు

మ.రా.రా.శ్రీ.జంపాల శ్యామసుందర ప్రసాద్ చౌదరి గారు భూస్వామి సారస్వత మండలి అధ్యక్షులు సంగంజాగర్లమూడి

### రాజ పోషకులు

మ.రా.రా.శ్రీ కంటిపూడి పెదరామయ్యచౌదరిగారు పంచాయితీబోర్డుఅధ్యక్షులు మోర్త పశ్చిమ గోదావరిజిల్లా
,, కంటిపూడి బాపన్నచౌదరిగారు భూస్వామి మోర్త
,, తాతిని పెదఅమ్మన్నచౌదరిగారు ,, ,,
,, గోవాడ రంగనాయకులుచౌదరిగారు భూస్వామి మాచవరం
,, యెండూరి నాగభూషణంచౌదరిగారు ,, ,,
,, యెండూరి శ్రీరామయ్యచౌదరిగారు ,, ,,
,, వేజండ్ల బాపయ్యచౌదరిగారు పంచాయితీబోర్డు అధ్యక్షులు వల్లభరావుపాలెం
,, మదమంచి ప్రకాశరావుచౌదరిగారు ,,
,, మారుపూడి గోవిందరాజులుచౌదరిగారు చింతలపూడి

# పోషకులు

మ.రా.రా.శ్రీ.గోగినేని వెంకటసుబ్బయ్యాచౌదరి గారు పంచాయితీబోర్డు అధ్యక్షులు ఈమని

,, కోగంటి వెంకటరమణచౌదరిగారు చింతలపూడి

,, ధూళిపాళ్ల కృష్ణయ్యచౌదరిగారు ,,

,, కంటిపూడి సూర్యనారాయణచౌదరిగారు పొన్నూరు

,, కంటిపూడి చినకామన్నచౌదరిగారు ,,

,, కంటిపూడి సూర్యారావుచౌదరిగారు ,,

,, కంటిపూడి వెంకట్రామయ్యచౌదరిగారు ,,

,, దొడ్డా వెంకటస్వామిచౌదరిగారు పంచాయితీబోర్డుఅధ్యక్షులు అన్నంభొట్లవారి పాలెం

,, ఇడుపులపాటి వెంకటేశ్వర్లుచౌదరిగారు ,,

,, ఆళ్ల తిరుమలయ్యచౌదరిగారు ,,